తచ్ఛాపవృత్తాంతము నామనమును భేదింపమూర్ఛిల్లినది. అట్టిసమయమున గృహమందలి రోదనధ్వని నేమనిచెప్పను.

శ్లో॥ యక్షాధీశప్రియసహచరీ రక్షణాయస్వసఖ్యా
భర్తృజ్ఞాతత్రిభువనసవిత్ర్యంబికామంత్రసారా
పత్యుఃప్రాప్తాంవిరహజశుచంమార్ష్టుకామాగతదానీ
మేతాప్రేయోనుమతివశతస్సాధు కారుణ్యపూర్ణా॥

చ॥ తనపతిశాపమిచ్చినక ✻ తంబునభర్తృవియోగదుఃఖమున్
గనుచెలినూరడింపఁగమ ✻ నంబుననిరికలెత్తు ప్రేమచే
తనుచను దెంచుభర్తృధిగ ✻ తంబగుమంత్రరహస్యవేదియౌ
ధనపతికాంతయక్షసతి ✻ తాపముమాన్పఁగ భర్తృనానతిన్॥ ౮॥

అర్థము—భర్తృ......సారా, భర్తుః=తనపెనిమిటివలన, జ్ఞాత=తెలిసికొనబడిన, త్రిభువనసవిత్రీ=ముజ్జగములతల్లియగు, అంబికా=పరదేవతయొక్క, మంత్ర=మంత్రముయొక్క, సారా=బలముకలిగిన, యక్షాధీశప్రియసహచరీ=అ కుబేరునిభార్య, పత్యుఃప్రాప్తాం=తనభర్తవలన నాయక్షకిఁగలిగిన, విరహజశుచం=వియోగదుఃఖమును, మార్ష్టుకామా=పోగొట్టనిశ్చయించినదై, సాధు=బాగుగా, కారుణ్యపూర్ణా=దయచేనిండినదై, ప్రేయోనుమతివశతః=తనభర్తయొక్క అనుమతివలన, స్వసఖ్యాః=తనస్నేహితురాలియొక్క, రక్షణాయ=రక్షణముకొరకు, తదానీం=అప్పుడు, ఏతా=వచ్చినదాయెను.

తా—అప్పుడు తనభర్తనుండియే పొందబడిన పరదేవతోపాసనకలిగినయా కుబేరుని భార్య, తనభర్తృశాపమువలన తనసఖురాలికిఁ గలుగు విరహదుఃఖమును పోగొట్టనిచ్చయించినదై, పరిపూర్ణమైనదయకలదై, తనపెనిమిటి యనుమతివడసి యాయక్షకాంత నోదార్చుటకై యేతెంచె.

"ప్రేయోనుమతి" ప్రభుధర్మమున నాజ్ఞాతిక్రమణదోషమునకుఁ దగుదండన సేవకునకు విధించియున్నను, యాతనికుటుంబిని సంరక్షించుటకై మిగుల దయగలవాఁడై దేవియుపాసకురాలగు తనభార్యనంపి యామెదుఃఖం బుపశమింపజేయ

కొంచియుంటచే కుబేరుని యందలి సాత్వికాదిగుణములు పరికటితములగుచున్నది. మహాత్ములు వ్యవహారవిషయముల కాఠిన్యమునిమిత్తమాత్రముగ వహించినను తత్క్షణమే ప్రసన్నహృదయులగుదురని తెలియుచున్నవి.

శ్లో॥ త్వయ్యాస్తే మే ప్రియసహచరో వత్సలత్వావృతాత్మా
ధీరస్వాంతాం రచయితుమహం ప్రేషితా తేనచత్వాం
ఏతత్కాలోదితవిరహతో మాయాహి మావిక్లబత్వం
కాలే కా వా న భవతి సతీ వంచితా రుష్టదిష్టాత్ ॥

చ॥ ఐలబిలుండు నీ యెడఁ గృ * పాన్వితుఁ డై తఁ డయు నీదు వంతను
న్మ్రాలముఁ జేయ నీ మదికి * బూన్పఁగ ధైర్యము నన్నుఁ బంపెనీ
కాలమున న్వియోగజవి * కారము బొందకు నెమ్మి జూడఁగా
గాలము రాగ దుఃఖవతుల * గాంచ రె సాధ్వులు దైవవంచనన్ ॥ ౫౫॥

అర్థము — మే = నా యొక్క, ప్రియసహచరః = భర్త, త్వయి = నీయందు, వత్సలత్వావృతాత్మా = ప్రేమతో గూడిన మనస్సుగలవాడై, ఆస్తే = ఉంచున్నాడు, తేనచ = ఆనా ప్రియుడైన కుబేరుని చేతనే, త్వాం = నిన్ను, ధీరస్వాంతాం = ధైర్యముగలమనస్సుగలదానిగా, రచయితుం = చేయుటకొరకు, అహం = నేను ప్రేషితా = పంపబడితిని, ఏతత్......హతః, ఏతత్కాల = ఈకాలమందు, ఉదిత = పుట్టిన, విరహతః = వియోగమువలన, విక్లబత్వం = కాలుష్యమును, మాయాహి = పొందకుము, కాలె = సమయము వచ్చినప్పుడు, కావాసతీ = ఏపతివ్రత, రుష్టదిష్టాత్ = ప్రతికూలదైవమువలన, వంచితా = వంచింపబడినది. నభవతి = కాదు.

తా — నా ప్రియుడగు కుబేరుడు నీయందనుగ్రహము కలవాడైయుండుటవలన నీకు ధైర్యము చెప్పుటకు నన్ను పంపియున్నాడు. ఈసమయమున కలిగినవియోగమునుగూర్చి విచారపడకుము. కాలమునుబట్టి ఎట్టిపతివ్రతలైనను ప్రతికూలదైవముచే వంచితలై దుఃఖము నొందుదురు. "ధీరస్వాంతాం" ప్రియవియోగమువలనదుర్బలమైనను మనస్సును మనమునకుభర్తృపునరాగమాది వాక్యంబుల నాశకల్గించి దేవ్యపాయ వ్యావృత మనస్కను జేయుటచే ధైర్యమునుకలుగఁజేసెను. లోకము

# ద్వితీయస్సర్గః.

నార్తులగువారు ధీరులేయైననాయిక్కట్టు వొడమినతరి, పరులచే నాశ్వాసింపఁబడి నగాని ధైర్యమువహింపజాలరు. పరులసానుభూతియు దుఃఖమును కొంతలఘుంబు తమకంటె యున్నతపదవినున్నవారలే కడుదుర్భరంబులగు యిడుములఁబొల్పడుట జూచిన తమయిక్కట్టులంత దుర్భరముగదోపవు.

శ్లో॥ ప్రాగింద్రాణీ ప్రియసహచరే పద్మనాళే నిలీనే
దుఃఖం ప్రాపచ్చిరవిరహజం క్లేశమాపచ్చ లక్ష్మీః
తాదృశ్యోఽన్యా అపి సమభవన్ ప్రాయశోఽస్మద్విధానాం
కా వా గాధా భవతి విహితం కర్మ భోక్తవ్యమేవ।

చ॥ సురపతి పద్మనాళమునఁ జొచ్చిన వేళ వియోగదుఃఖ సా
గరమున మున్గె శచియు శాంతుని బాసి రమావధూటియుఁ
గరముఁ గృశింపదే మఱియుఁ గాంచరె దుఃఖము లెందఱెందఱో
ధరమన మేమి లెక్క విహితంబగు కర్మము భోజ్యమే కదా॥ 2॥

అర్థము — ప్రాక్ = పూర్వకాలమున, ఇంద్రాణీ = శచీదేవి, ప్రియసహచరే = ప్రాణనాథుఁడగు దేవేంద్రుఁడు, పద్మనాళే = తామరతూఁడునందు, నిలీనే = దాఁగియుండఁగా, చిరవిరహజం = చిరకాలవియోగమువలన గలిగిన, దుఃఖం = బాధను, ప్రాపత్ = పొందెను. లక్ష్మీశ్చ = లక్ష్మీదేవియు, క్లేశం = దుఃఖమును, ఆపత్ = పొందెను. అన్యా అపి = దమయంతి మొదలగు నితరులును, తాదృశ్యః = అట్టిదుఃఖము ననుభవించిన వారు సమభవన్ = అయిరి. ప్రాయశః = తఱుచుగా, అస్మద్విధానాం = మనబోఁట్లవిషయమై, కావాగాధా భవతి = చెప్పవలసినదేమి. విహితం కర్మ = విధింపఁబడిన (చేసుకొనిన) పాపపుణ్యాది రూపకమగు కర్మ, భోక్తవ్యమేవ = అనుభవింపఁదగినదే.

తాత్పర్యము — వృత్రాసురవధానంతరము, బ్రహ్మహత్యవలన నింద్రుఁడు స్వపదభ్రష్టుఁడై సూక్ష్మశరీరముతో పద్మనాళములో వసించియుండుటవలన శచీదేవికి వియోగము కలిగెననుట, విష్ణుని దశావతారసమయములయందు లక్ష్మి వానివియోగమును సహించెనను కథలిచ్చటననుసంధేయములు. పూర్వకాలమున, శచీ, లక్ష్మీ మున్నగువారలే విరహమువలన క్లేశము జెందియుండగా మనబోఁటివారిలెక్క యేమి

ఖునియు, పురాకృతమగు కర్మననుభవింపక తీరదనియుఁ జెప్పి యాకుబేరపత్ని యా పెనోదార్చె. ఇచ్చట కావ్యార్థాపత్తియలంకారము.

“విహితంకర్మభోక్తవ్య” మనుటవలన “సుఖస్యదుఃఖస్యనకోపిదాతా పరోదదాతీతికుబుద్ధిరేషా” అనున్యాయంబున దేహికి, సుఖదుఃఖంబులు కర్మనియతంబులనియు, తదనుకూలముగా నితరులు నిమిత్తమాత్రులనియు నందువలన కుబేరుని యందలి దోషారోపణనపనయించి తత్త్వార్థమును చెప్పఁదలఁచినదని ఈవక్ష్యమాణంబులగు దేవీవాక్యముల ఫలితార్థమును సూచించుచున్నది.

శ్లో॥ ధాతాప్యుద్యన్నిగమనిచయప్రాక్ప్రణేతాపిభిన్న
శీర్షస్థానే నిటలనయనః ప్రాక్సతీవిప్రయోగం
శ్రీరామోపిక్షితివరసుతావిప్రయోగం విషేహే
కేవానస్యుః పరిభవపదం కర్మణా స్వార్జితేన॥ ౧

చ॥ నలువశిరంబుఁ గొట్టఁ బడి నాడు గడానిగమాళికొజ్జయై
చెలఁగియుఁ గాంతఁ బాసి శశిశేఖరుఁ డెంతయు వంతనొందెఁ దాఁ
గులసతివీడి రాఘవుఁడు గుందడె స్వార్జితనైజకర్మచే
బలిమిపరాభవంబులకుఁ బాల్పడకుండెడి వారలుందురే॥

అర్థము — ఉద్యన్నిగమనిచయప్రాక్ప్రణేతా, ఉద్యత్ = ప్రకాశించుచున్న నిగమనిచయ = వేదసమూహముయొక్క, ప్రాక్ప్రణేతా = ప్రథమోపదేష్టయగు, ధాతాపి = బ్రహ్మయును శీర్షస్థానే = శిరఃప్రదేశమున, భిన్నః = ఖండింపఁబడెను, నిటలనయనః = సాంబమూర్తియు ప్రాక్, పూర్వము, సతీవిప్రయోగం = భార్యావియోగమును, విషేహే = సహించెను, శ్రీరామోపి = శ్రీరాముడున్నూ క్షితివరసుతావిప్రయోగం = సీతాదేవి యెడబాయుటను, విషేహే = సహించెను, స్వార్జితేన = స్వయముగ సంపాదించిన కర్మణా = కర్మచేతను, కేవా = ఎవరు, పరిభవపదం = తిరస్కారమునకు స్థానము, నస్యుః = కారు, అందఱునగుదురనుట.

తా — ఈప్రకారము కుబేరపత్నియక్షకాంతనుగూర్చి పూర్వము లోకములను సృజించుటకైన సామర్థ్యంబుగల బ్రహ్మయు, లోకముల సంహరించుటకు

సమర్థుండగు రుద్రుండును, జగదేకవీరుండగు రాముండును, స్వార్జితకర్మచే పరిభూతులయిరని చెప్పి ప్రస్తుతమగు యక్షకాంతకుఁగలిగిన వియోగమును పూర్వకర్మజనితంబేయనియు కావున పరితివారును కర్మబద్ధులుగాక తప్పదనియుఁ జెప్పె. ఇచ్చటయర్థాంతరన్యాస యలంకారము. బ్రహ్మయు విష్ణువును కలహించినప్పు, దన్నుతంబాడిన బ్రహ్మపంచమశిరంబు రుద్రుండుద్రుంచెననియు దక్షునియజ్ఞంబున తండ్రి తిరస్కారంబునంజేసి సతీదేవి శరీరత్యాగముఁజేయ, తిరిగి హిమవత్పుత్రికయై వివాహమాడువరకు కల్గిన వియోగమును శివుడుసహించెననియు, దండకారణ్యవాసియగు రాముండు సీత రావణాపహృత గా నొకవత్సరంబును, లోకాపవాదకై జానకిని స్వయముగా విడిచియును తద్వియోగమును సహించిరనువి పురాణప్రసిద్ధములు.

శ్లో॥ న స్త్రీ నా మోత నుభయవపుర్నాప్యనిర్వాచ్యరూపా
బ్రహ్మాదీనామపి చ జననీ లోకరక్షాప్రసంగాత్ ।
నానారూపా విరచితకృతిః పూజితా చక్రిముఖ్యై
ర్నిస్త్రైగుణ్యే మహసి కుసుమే సౌరభశ్రీరివాస్తే॥

చ॥ పురుషుఁడు తన్వియున్ గనన పుంసకమైనను గాక బ్రహ్మకున్
హరిముఖదేవతాతతికి నందనిరూపముఁ గల్గి వంద్యయై
వఱలు మదల్లి నాగవలభంగుల రూపముఁ దాల్చి పువ్వునన్
బరిమళమట్లు నిర్గుణవిభాస్వరతేజమునన్ వెలింగెడిన్॥ ౨॥

అర్థము — స్త్రీ = స్త్రీస్వరూపముగలది, న = కాదు, నా = పురుషాకృతి గలది, న = కాదు, తదుభయవపురపి = స్త్రీపురుషోభయాకృతి గలదియును, న = కాదు, బ్రహ్మాదీనామపి = బ్రహ్మ మొదలగువారికిన్ని, అనిర్వాచ్యరూపా = వచింపతగని స్వరూపముకల్లదై, లోకరక్షాప్రసంగాత్ = లోకములను కాపాడుటవలన, జననీ = తల్లియైనట్టియు, నానారూపా = చండికాలలిత మొదలగు అనేక రూపములుగలదై, విరచితకృతిః = చేయబడిన ఆయా రాక్షసులవధాదిరూపవ్యాపారముకలదగుచు, చక్రిముఖ్యైః = విష్ణు మొదలగువారిచేతను, పూజితా సతీ = పూజింపఁబడినదగుచు, నిస్త్రైగుణ్యే = సత్వాదిగుణరహితమైన మహసి = తేజస్సునందు, కుసుమే = పుష్పమునందు, సౌరభశ్రీరివ = పరిమళసంపదవలెనే, ఆస్తే = ఉంచున్నది.

తా — స్త్రీపురుషరూపములుగానట్టియు, నానారూపములఁబొందినట్టియు, లోకరక్షణమే ముఖ్యముగ వశీగాఁగలదగుటవలన జగన్మాతయని పేర్కొనఁబడగినదియు, బ్రహ్మవిష్ణుమొదలగు దేవతలచేఁ బూజింపఁ బడినదియునగు అపరదేవత, పుష్పములయందు ఘ్రాణేంద్రియ మాత్రగోచరమగు పరిమళమువలెనే, త్రిగుణరహితమగు తేజస్సునందు వ్యాపించినదై తేజోమయస్వరూపమొకటిగలదని చెప్పెను.

“బ్రహ్మేంద్రమహేంద్రాది దేవసంస్తుతవైభవా” యనియు “కరాంగుళి నఖోత్పన్ననారాయణదశాకృతిః” “పంచప్రేతాసనాసీనాపరబ్రహ్మస్వరూపిణీ” ఇత్యాది లలితోపాఖ్యానవాక్యాదులనుబట్టి, విష్ణ్వాదులచే నుతింపఁబడినదై వారివారికి సృష్ట్యాది సామర్థ్యంబుల నొసంగుచు, లీలామాత్రముగ నవతారములఁ గల్పనఁజేయుచు, తాను ననేకరూపములవహించినదైనను గుణరహితంబగు శుద్ధసత్వమున క్షీరంబుల ఘృతంబువలె సర్వవ్యాపినియై “పతివ్రతాభీష్టఫలదా” యనిపతివ్రతయగు నిన్నుఁగాపాడు సామర్థ్యంబుగలదిగావున నామెనుపాసింపుమని చెప్పెనని తాత్పర్యము.

శ్లో॥ సైవాశేషాన్హరిహరముఖాన్ మోదభేదానయంతీ
తత్తత్కాలే నిజపదనలానక్తచిత్తప్రభూణాం
ఇష్టాన్భోగా నిహపరసుఖప్రాపకం జ్ఞానమాద్యం
యచ్ఛత్యేధీమతి విజయతే శ్రీపరాశక్తిరాద్యా॥

చ॥ హరిహరులాదిసర్వవిబుధాళులఁ గాలముచేత మోద దుః
ఖరసములందు దేల్చుపద కంజములన్వినుతించుభక్తులన్
సరగున భోగ్యముజ్ఞానమునా సంగిపరంబు నిహమ్ములిచ్చి యో
వరమతియాపరాంబిక ప్రభావతియై విలసిల్లుగావుతన్॥ ౯॥

అర్థము — హేధీమతి=ఓబుద్ధిమంతురాలా! సాఆద్యా=ఆదిసర్వమునకు మొదటికారణమైన, శ్రీపరాశక్తిః=శోభాయుక్తయగు నాపరదేవతయే, అశేషాన్=సమస్తులైన, హరిహరముఖాన్=హరిహరులు మొదలుగాగలవారిని, మోదభేదాన్=సంతోషము=దుఃఖములను తత్తత్కాలే=ఆయాఅనుభవకాలమందు, నయంతీ=

పొందించుచున్నదై, నిజపదనలా=తనపాదపద్మములయందు, ఆసక్త=కలుగుకొన్న చిత్త=మనస్సుగలిగిన, పరిభూణాం=పరిభువులైనభక్తులకు, ఇష్టాన్=కోరికలను, భోగాన్ = ఐశ్వర్యాదిభోగములనున్నూ, ఇహపరసుఖప్రాపకం=ఇహపరసుఖముల నిచ్చెడి, ఈడ్యం = స్తుతింపఁదగిన, జ్ఞానం = బుద్ధివికాసమును, యచ్ఛంతీ = ఇచ్చు చున్నదై, విజయతే = సర్వోత్కర్షచే ప్రకాశించుచున్నది.

తా—హరిహరాదులకైనను సుఖదుఃఖము లొసంగసామర్థ్యముగల సాపరదే వతను నీవుపాసించిన నీవియోగదుఃఖముపశమించుటేగాక, జ్ఞానోదయంబగుటవ లన, విషయవిముఖురాలవై యానందమును పొందగలవని తాత్పర్యము

శ్లో॥ తస్మాదద్యత్వమపినియతాహారచర్యాకదర్యా
సన్మర్యాదాశ్రియభగవతీంపాపతామిస్రచాంద్రీం।
సాసంతుష్టానిజభజనతస్తద్వియోగేనజాతం
తాపంసర్వంహరతితదనుస్వేష్టలక్ష్మీంతనోతి॥

ఉ॥ ఆపరశక్తికోర్కులనయుంబునొసంగఁనుగాననిప్పుడీ।
యాపదఁబాపఁగానియమ హారవిహారముచేఁనింద్యవై
పాపతమిస్రచంద్రికశుభంకరిఁగొల్చినమెచ్చినీమన।
స్తాపముఁదీర్చిచిష్టములొసంగునునీదగుభక్తిపెంపున్॥ ౧౦॥

అర్థము—తస్మాత్=అందువలన, ఆ పరశక్తైహికాముష్మికసుఖములని చ్చునదిగావున, త్వమపి=నీవును, నియతాహారచర్యాకదర్యా, నియత=నియమితమ గు, ఆహార=ఆహారముయొక్క, చర్యా=అనుచరణచేతను, అకదర్యా=నిందింపబడని దానవై, సన్మర్యాదా = యోగ్యమైనపడతగలదానవగుచు, పాప...చాంద్రీం పాపతామిస్ర = పాపమనెడిచీకటికి, చాంద్రీం = చంద్రికయైన, భగవతీం = ఆఈ శ్వరిని, ఆశ్రియ = ఆశ్రయింపుము, సా = ఆభగవతియు, నిజభజనతః = నీదగుసేవ వలన, సంతుష్టా = సంతసించినదై, తద్వియోగేన = నీవియోగమువలన, జాతం = పుట్టిన, తాపం = మనోవ్యాకులతను, హరతి = హరింపజేయును, తదను = తరువాతను, స్వేష్టలక్ష్మీం = తమతమకోరికలను సంపత్తునున్నూ, తనోతి = కలుగజేయుచున్నది

తా—కావున సర్వపాపములపోఁగొట్టు యాయాశ్వరినితపోవియమముల స్వత్వవ ర్తనగల దానవగుచు ధ్యానింపుము. ఆమెయు నీసేవవలన సంతుష్టి జెందినదై నీవిరహతాపమును శమింపఁజేయఁగలదు, అమీఁద నీకోరికలు లభించునని యాకుబేరుని భార్యచెప్పెను.— "నియతా......అకదర్యా" అహారనియమంబు, నధశ్శయనాదులును వరితంబుసల్పువారి,చిత్త మన్యాకాంతంబుగా నుండునట్లొనర్చి, కామమోహాదుల శమింపఁజేయు గావున, నీమెయునట్లుండవలయునని చెప్పుచున్నది.

శ్లో॥ ఇత్యుక్త్వేవశ్రివసికిమపి వ్యాహృతంసావితీర్య
ప్రాపాగారంనిజమధసఖీసాధువృత్తిఃకుబేరీ।
తత్కాలాదివ్యపగతమహాశుక్రమాప్రాప్తధైర్యా
లక్ష్మీసేవాకృతిమతిరభూత్యక్తలోకప్రచారా॥

చ॥ ధనదుని కాంతయాఁగతిని ధైర్యముఁజెప్పుచు నా పెశ్రోత్రిమం।
దునవొకమంత్రమెద్దియొకు తూహలనుందఁగఁజెప్పిదానికే।
తనమునకేఁగనీపెమదిఁ దాపమువాయుచునప్పెధీరయై।
మనమునన్యచింతలను, మానిభజించెసదాపరాంబికన్॥ ౧౧॥

అర్థము—అధ=తరువాతను, సఖీసాధువృత్తిః; సఖీ= స్నేహితులయందు, సాధువృత్తిః= యోగ్యమైన వ్యాపారముగల, కుబేరీ=ఆకుబేరుని భార్య, ఇతి= ఈలాగున, ఉక్త్వా=చెప్పినదగుచునే, శ్రవసి=శ్రోత్రమందు, కిమపి=ఏదోయొక, వ్యాహృతం=మంత్రరూపమగుమాటను, వితీర్య=చెప్పి, అనగాఉపదేశించి, నిజం=స్వకీయమైన, అగారం=గృహమును,ప్రాప=పొందెను. (ఇకనాయక్షకాంత) తత్కాలా......క్రిమా, తత్కాలాది=ఆకాలము మొదలుకొని, వ్యపగత=పోయిన, శుక్రక్రమా=దుఃఖముయొక్కరీతిగలదై, ప్రాప్తధైర్యా= ధైర్యము తెచ్చుకొని, త్యక్తలోకప్రచారా=విడువఁబడిన ప్రపంచకప్రసంగముకలదై, లక్ష్మీసేవాకృతిమతిః=లక్ష్మినుపాసించుటయందు కృతనిశ్చయురాలైనది, అభూత్=ఆయెను.

తా—ఈప్రకారము చెప్పినదై యాకుబేరపత్నియక్షకాంత శ్రోత్రమందొకమంత్రమునుపదేశించి తనగృహమునకు నిర్గమించెను. అనంతరమందు (అ

నగానాకుబేరాంగన మంత్రోపదేశము చేసినది మొదలు యక్షకాంతయు శోకమువిడిచి, లక్ష్మీసేవాయత్తైక చిత్తయగుట వలనప్రాపంచక విషయములనుండి తొలఁగినదై తత్సేవాసక్తురాలయ్యెను.

శ్లో॥ వ్యాఖ్యాతీవ ప్రకృతిమహితం పద్మినీత్వంచ బుధ్వా
కల్యేకల్యప్రసరణ కలాలోచనోత్ఫుల్లపద్మా
స్నాత్వాసీనాసు రుచిరపదపీఠదేశేదృశాళి
ప్రోతఘ్రాణా కిమపిజపతి స్మాధ్వనివ్యాహరంతీ।

చ। తెలిపెను, పద్మినీత్వమును తేటగమాసతియంచునెంచఁగా
జలజనిభంబులోకనులు చక్కఁగఁగల్యనువిప్పిసుప్తిదా
దొలఁగి పవిత్రనీరములఁ దోఁగిసుఖాసనమందుఁ జేరిచూ
పులువడినాసఁజేర్చి, జప మున్మదినిమ్ముగఁజేసెనెద్దియో॥    ౧౨॥

అర్థము—ప్రకృతి=స్వభావముచేత, మహితం=ఒప్పుచున్న, పద్మినీత్వం చ=పద్మినీత్వమునైతే(అనగ. పద్మినీజాతిస్త్రీత్వమును, తామరతీగెతనమునున్నూ) వ్యాఖ్యాతీవ=ప్రకటించునదివలెనే, కల్యే=ప్రత్యూషమందే=కల్య...పద్మా కల్య=యోగ్యమైన, ప్రసరణ=వికాసమనెడు, కళా=కళలతోగూడిన, లోచనోత్ఫుల్లపద్మా=వికసించినపద్మములవంటి నేత్రములుగలదై, బుధ్వా=మేలుకొని, స్నాత్వా=స్నానముఁజేసి, సురుచిరపదె=మంచిచిహ్నములుగల, పీఠదేశె=ఆసనమందు, ఆసీనా=ఉపవిసించినదై, దృశాళిప్రోతఘ్రాణా, దృశా=చూపులయొక్క, ఆళి=వరుసచేత, ప్రోత=కూర్పఁబడిన, ఘ్రాణా=నాసికగలదై, అధ్వని=ధ్వనిలేకుండగా, కిమపి=ఏదోఒకదానిని, వ్యాహరంతీ=ఉచ్చరించుచున్నదై, జపతిస్మ=జపముచేసినదాయెను.

తా—ఆయక్షకాంత తపఃప్రకారం బెట్టిదనిన. తానుపద్మినీజాతిస్త్రీయగుటచే ప్రాతఃకాలమున తామరతీగయెట్లువికసించునోయట్లేతన కనుదమ్ములనువిప్పితనపద్మినీత్వమును ప్రకటించుచున్నదై, స్నానముఁజేసి శుభప్రదమైనసుఖా

పవనమువహూర్చుచున్నదై, నాసాగ్రమందు దృష్టినుంచి నిశ్శబ్దముగ జపముచేయ బ్రారంభించెను.

“పరిష్కృతిమహితంపద్మినీత్వం” ప్రాతఃకాలంబున పద్మములు వికసించుట స్వభావసిద్ధము. అట్లనే నీయుత్తమాంగనయు పద్మసదృశంబులగు నేత్రంబులవిప్పె ననియు, శ్లేషచే, నీమెపద్మినీజాతి స్త్రీయగుటచె నప్పద్మినీత్వమును ప్రకటింపజే యుచున్నదని తెలియుచున్నది. మఱియు “సురుచిరపదేపీఠదేశే” అనునది అభీష్టప్రదంబులగు బృశాద్యాసనంబుల నాసీనయగుటయు, “దృశా...ఘ్రాణా” నాసాగ్రన్యస్త దృష్టియగుటవలన తపోనియమదార్ఢ్యార్థము ముద్రికాధారిణియగుట యును, “అధ్వని” మౌనమునవలంబించినదై మానసికజపము చేయుచుండుటవలన నీమెవాఙ్మనోనియమములను నైష్ఠికతను జాటుచున్నవి.

శ్లో॥ ఫుల్లాంభోజప్రభవరససంభావితంశీతమంభ
స్సంపుష్టోస్రాస్రుతమపిపయఃకల్పితేనాదనాయ
స్వాంతర్గంధార్జనమతిమరుత్సంగతప్రాణవర్గా
శైవీధ్యానావహ్నాతమహితాగారకృత్యేయమాసీత్ ॥

చ॥ జలజమరందసక్తమగు చల్లని, నీరముత్రైనవింటిలో
వలగలయావుపాలయిన పానము సేయక గాలిమాత్రమే
పొలఁతిగ్రహించి భక్తిగను మోదముతోడపరాంబికావదం
బుల్లమదినిల్పియింటిపని బూనకధ్యానముసేయుచుండెడిన్ ॥ ౧౩॥

అర్థము—ఫుల్లాం......వితం, ఫుల్లాంభోజ=వికసించినతామరపుష్పముల నుండి, ప్రభవ=పుట్టిన, రస=మకరందముతో, సంభావితం=కూడుకొనిన, శీతం చల్లని, అంభః=ఉదకమును, సంపు......స్రుతం, సంపుష్ట=బాగుగపోషింపబడిన, ఉస్రా=ఆవునుండి, స్రుత=పితుకబడిన, పయఃఅపి=పాలున్నూ, అదనాయ=భుక్తికొఱకు, నకల్పితే=ఉపయోగింపబడలేదు, ఇయం=ఈయుత్తమకాంత, స్వాంత... వర్గా, స్వ=తనయొక్క, అంతర్గంధ=అంతస్సంబంధముయొక్క, ఆర్జన=సంపాదనయందు, మతి=బుద్ధిగల, మరుత్=గాలితో, సంగత=కలుసుకొన్న, ప్రాణవర్గా=

ప్రాణసమాహారముగలదై, అనగా వాయుభక్షణమాత్రయైయుండుట, దేవీధ్యానా ... కృత్యా, దేవీధ్యానా=అపరాశక్తిధ్యానముచేత, అపవ్యాత=విడిచిపెట్టఁబడిన, వర్తి తా= ఒప్పుచున్న, అగారకృత్యా=గృహవ్యాపారములుగలదై, ఆసీత్=ఉండెను.

తా—తపంబాచరించుచున్న నీ యత్నకాంతపరదేవతాధ్యాన పరవశయగుటచే పద్మసంవాసితంబులగు శీతలోదకంబులనుగాని, చక్కనియావుపాలనుగాని యాహారముగాగ్రహింపక పోయెను. మఱియు నా ప్రాణవాయువులతో సంబంధము నొందవలెనని కోరికతో వెలుపలిపిల్లవాయువులు, మెల్లగా నీ శరీరమున, జొచ్చి బయలు వెడలుచున్నవాయన్నట్లీమె నిశ్వాసోశ్వాసములమరుచుండె. కావున నీమె కు వాయువుమాత్రమే జీవనాధారంబనియు, నదియుబుద్ధిపూర్వకముగ గ్రహింపకుండెననియు "ప్రాంతర్గంధా" ఇత్యాదివిశేషణముచే తెలియుచున్నది. "నాదరాయ కల్పితే" శరీరసుఖదాయకంబులగు నీవస్తువుల నిక్షేపముగా విడిచెననుటవలన నీమె నైష్ఠికతయు తపోమహిమయు ప్రచురమగుచున్నవి.

శ్లో॥ ఏవంజాతేకియతిమహతేకాలేతస్యాఃక్లేశలబ్ధే
స్వప్నే దేవీవిహితవిలసత్సన్నిధానైవమూచే
తుష్టానాహంతవనియమతస్సక్తితీవ్రవ్రతాస్యా
మత్కారుణ్యాదుపరిమహితేభోక్ష్యసేభవ్యభోగాన్॥

చ॥ జనకఁగనంతకాలమిటు స్వప్నమునందగనుపించియాపరా
త్పరయిటువల్కెనీదయిన భక్తికిమెచ్చితిసాధ్వినీవున
త్వరముగవీడుమీతపము భవ్యసుఖంబులనందెదింకము
త్కరుణకుఁబాత్రులై భువిముదంబునుబొందనివారలుందురే॥ ౧౪॥

అర్థము—ఏవం=ఈప్రకారముగా, కియతి=కొంత, మహతే తేఅనేహసి=తపస్సుచేయుచున్నకాలము, జాతే=జరుగగా, క్లేశలబ్ధే=కష్టసాధ్యమైన, స్వప్నే=స్వప్నమందు, విహిత=చేయఁబడిన, విలసత్=ప్రకాశించుచున్న, సన్నిధానా=సాన్నిధ్యముకలదై, దేవీ=అపరదేవత, ఏవం=ఈప్రకారము, ఊచే=పలికెను, మహితే=ఓపూజ్యురాలా, తవ=నీయొక్క, నియమతః=వ్రతమువలన, అ

హం=నేను, తుష్టైవ=సంతోషించినదానవే. త్యక్త...వ్రతా, త్యక్త=విడువఁబడిన, తీవ్రవ్రతా=తీవ్రమైన వ్రతముకలదానవు, స్యాః=అగుమా, ఉపరి=ఇకమీఁదను, మత్కారుణ్యాత్ = నాదయవలన భవ్యభోగాన్= మంచిసంపత్తులను, భోక్ష్యసె=అనుభవింపఁగలవు.

తా॥ ఇట్లుకొంతకాలము తపస్సుచేసినపిమ్మట ఆపరదేవత స్వప్నమందు ప్రత్యక్షయై, "నీతపమునకు మెచ్చితి" ఇట్టికఠినవ్రతమిక సల్పఁజనదు. నాయనుగ్రహము వలన నీకుసుఖములు గలుగునని చెప్పెను.

భక్తశ్రేణీసరతరళతస్తస్య యక్షేశ్వరస్య
వ్యాహారం మే౽ద్య విఫలయితుం నోచితం సత్యమేతత్
మత్సేవాతస్సముదితరసాప్యస్మి వాం విప్రయోగం
నేచ్ఛామ్యద్య ప్రవిఘటయితుం వర్తతే బీజమన్యత్ ॥

చ॥ విలబిలుఁడు భక్తగణహారచిరత్నము వానివాక్యమే
జాలను ద్రిప్పనీ నొడఁబడంతసముందితి నీదు సేవతో
బాలవియోగదుఃఖమెడఁబాపఁగఁ జాలను దేనిబీజమే
పోలఁగఁ జెప్పెదన్విను ముపూర్వకృతమ్మది విస్తరమ్ముగన్॥ ౧౫॥

అర్థము—భక్త......తః, భక్త=భక్తులయొక్క, శ్రేణీ=సమూహమనెడు సర=హారమునకు, తరళతః=మధ్యమణియైనట్టి, అనగా భక్తాగ్రేసరుడైన, తస్య=ఆ, యక్షోత్తమస్య=కుబేరునియొక్క వ్యాహారం=మాటను, విఫలయితుం=వ్యర్థము చేయుటకొఱకు అద్య=ఇప్పుడు, మే=నాకు, నోచితం=తగినదికాదు, ఏతత్=ఇది సత్యం=సత్యము, మత్సేవాతః=నన్నుసేవించుటవలన, సముదితరసాపి=పుట్టినసంతోషముకలదానవైనను, అస్మి=నేను, వాం=మీయొక్క, విప్రయోగం=వియోగమును, విఘటయితుం=పోగొట్టుటకు, నేచ్ఛామి=ఇష్టపడను, అన్యత్=ఇతరమైన, బీజం=కారణము, వర్తతే=ఉన్నది.

తా—భక్తులలో నగ్రగణ్యుఁడగు నాకుబేరునియొక్క వాక్యముల వ్యర్థముగాఁ జేయుట దుర్లభము. (భక్తవాత్సల్యమువలన మహాత్ములైన కట్టుబడుదురనుట)

నీనియమపూర్వకమగు సేవకు మిగుల సంతసించిన దావనైనప్పటికి, జన్మాంతరక ర్మవిశేషమువలని బ్రాప్తించిన మీవియోగము పోఁగొట్టసాధ్యముకాదు. కావున నీత వంబుడుగుము. "నాభోగా త్క్షీయతేకర్మ" అనున్యాయంబున, నీశ్వరదర్శనాదు లవల ననాగామిసంచితములు నశించినను, ఆరబ్ధముయొక్క వేగమాపశక్యముగాద నియు, నొకజన్మమున మనుజుని యనుభవము వానివెనుకటిజన్మయందలి నడతనుబ ట్టియుండుననియు సూచింపబడుచున్నవి.

"బీజమన్యత్" పుణ్యపాపరూపములగు కర్మలయొక్క (వాసనలు)

శ్లో॥ పూర్వోత్పత్తౌ దుహితృవరయోర్దర్పకోద్యద్విరంసాం
జ్ఞాత్వాప్యేకో మతివిరహితో లగ్నకో భూన్న దైవాత్
సోస్మిన్జన్మన్యథ తవ పతిః ప్రాప్తబాధో వియోగా
త్కిం నో కర్మ స్వఫలముచితం సంతనోతీహ జంతోః ॥

చ॥ మునుపటి మేనని మగఁడు మోహితుఁడై నలరాజు కాకలఁ
గనలిన కూతునల్లురను గాంచియు వారలఁ గూర్పకుండె గా
వున నతఁ డీభవంబునను బొందెవియోగశుచంబు దప్పిపో
వునతనకర్మకర్మఫలము నొందక జీవులు కెందుమానినీ॥ ౧౬॥

అర్థము—ఏకః=ఒకడు, (నీభర్తయెయనుట) పూర్వోత్పత్తౌ=పూర్వజన్మ మందు, దుహితృవరయోః=తనకుమార్తెకునల్లునికిని, దర్పకోద్యత్=మన్మథునివలన గలిగిన, రిరంసాం=సంభోగేచ్ఛను, జ్ఞాత్వాపి=తెలిసికొనియును, మతివిరహితః= మతిలేక, దైవాత్ = దైవవశమువలన, లగ్నకః= సంధాత, నాభూత్ — కాలేదు, (సః=ఆపురుషుడు) (అథ=తరువాతను,) అస్మిన్ జన్మని= ఈజన్మయందు, తవ= నీకు, పతిః=భర్తయై, వియోగాత్=విరహమువలన, ప్రాప్త బాధః=బాధనుపొందిన వాడు, ఇహ=ఈలోకమునందు, జంతోః=జంతువుయొక్క, కర్మ=కర్మము, ఉచి తం=తగిన, స్వఫలం=తనఫలమును, నోసంతనోతికిం=చేయదాఏమి.

తా—పైజెప్పినకారణమేమనగా, నీపతివెనుకటిజన్మమున తన పుత్రికయు నల్లునును నొండొరులపై మరులుగొనియుండుట దెలిసియును, తెలివిలేమిచే వారి

సమాగమమును సమకూర్చకపోయె, కాన నీజన్మమున తాను పూర్వమొనరించిన వియోగఫలము నిప్పుడు నిన్నెడబాయుటచే ననుభవింపవలసె తా మొనరిచిన కర్మ ఫలమెంతటి వారికైన ననుభవింపక తీరదుగదా, "వియోగాత్ ప్రాప్త బాధః" అనుటవలన జన్మాంతరమునసే పాపంబొనరించిన తదనురూపంబగు ఫలంబుననుభవమునీ పుట్టువున ప్రాప్తించుటను సూచించుచున్నది" అనగా దానహీనునకు దరిద్రత, కర్మహీనునకు నీచజన్మలు, కృతఘ్నాదులకు బలవన్మరణము మొదలగునవి యాయా పాపంబుల కనురూపయనుభవంబులు సంప్రాప్తమగుట "కర్మస్వఫలం" కర్మము కర్మఫలము దేవతాదులకైన ననుభవించినగాని క్షీణింపదు, అద్దానిపోనడచుట వలను పడదు. ఇందుకు 'ప్రారబ్ధంభోగతో నశ్యేత్ నియమ' హతవిధిపరిపాకః సేనవాలంఘనీయః (భర్తృహరి) ఇత్యాదియాప్తవాక్యంబుల, చంద్రుడు తమాశ్రయము కలవాడయ్యు క్షీణదశ విడువజాలనటుల నెంతవారికైనపూర్వకృతకర్మ యనుభవనీయమని తెలియుచున్నది, మఱియు రామాయణోత్తరకాండమున దేవతారూపమునొందిన యొకరాజు పూర్వమున తానన్నదానాదులుచేయనికతంబున నాకలిదప్పులచేకడుబడలికనొంది శవభోజనుడయ్యెననుటయు ప్రసిద్ధము.

శ్లో॥ అన్యోన్యోద్యత్ప్రణయవశతాజాతకందర్పదర్ప
క్రాంతక్రీడావశగమనసోరర్థయూనోఃకయోశ్చిత్
ఆళీహిత్వంస్వపదవిన ముంబోద్దు కామావ శాశం
వా దాపశంతదసివిధు రాశాపపశపరిపహ్యాః॥

చ॥ స్మరవశులైనయూనలకు శంబళివై తొలిమేననీవు వా
రిరువురుక్రీడసల్పులిరి నేగతినిన్విడనెంచినారొ నీ
వటయఁగ వారికూటమికిపడ్డము గానటియించియుంటవో
తరుణిలభించె నీవిరహతాపముశాపముచేతభోగ్యమై॥ ౧౭॥

అర్థము — అన్యోన్య ... మనసోః, అన్యోన్య = ఒకరొకరియందు, ఉద్యత్ = పుట్టుచున్న, ప్రణయ = స్నేహమునకు, వశతః = స్వాధీనులగుటవలన, జాత, పుట్టిన, కందర్పదర్ప = మదనోద్రేకముచేత, క్రాంత = వ్యాప్తమైన, క్రీడా = సంభోగమునకు, వశగమనసోః = అధీనమైనమనస్సుగలిగిన, కయోశ్చిత్ - ఒకానొకరగు, అర్ధయూ

శోః=తగిన యౌవనవంతులకు, ఆళీ=చెలికత్తెవైన, త్వంహి=నీవైతే, స్వపదవిన యం=తనయందువారికిగలయడకువను, బోద్ధుకామా=తెలిసికొనవిశ్చయించినదాన వై, అవకాశం=వారికియవకాశమును, నాదాః=ఇచ్చినదానవుకావు తత్=ఆహే తువువలన, ఏవం=ఈవిధముగా, విసురా, విరహవతివి, అసి, అయితివి. గనుక, శా పఫలం=శాపమే, పరిసహ్యః=అనుభవింపతగినది.

తా—తొలిబామునసీవొకరికడ చెలికత్తెవైయుండి మోహవశంబున మదన క్రీడకై వేడుకపడుచున్న జవ్వనులకు నాశాభంగముగ నీయందువారికిగల వినయా దుల బరిశీలించుటకై (అనగతనను తిరస్కరించి క్రీడార్థమొంటొకతావుకేగెదరో, తనయందలి యాదరముచేతమకుతుకంబు వెలిబుచ్చకుండెదరో యను పరిశీలనకై) వారి ప్రేమాంకురముల వృద్ధిజెంది ఫలింపనవకాశమియ్యవైతివి, కావుననేనీకీవియో గముసంభవించె. స్వయంకృతమగుకర్మననుభవించినగానితీరదు.

ఈశ్లోకద్వయమువలన జీవులు కర్మవశగులై జన్మాంతరమునందునూ పర స్పరసంబంధముకలవారై, తదనురూపఫలంబుల ననుభవించుటకొఱకు పరిపాకావశం బున కాష్ఠాదులేకీభవించినట్లు కొంతకాలమన్యోన్యాశ్రయ సుఖదుఃఖములనుభవించు టకై నొకచోటగూడుచుందురనియు తెలియుచున్నది.

శ్లో॥ ఇత్యాదిస్ఫుస్ఫురితకరుణాసారమంతర్హితాయాం
తస్యాం కామేశ్వరవరతనావుత్థితైర్వాస్పదాళీ
తద్వృత్తాంతంసమగదదరంసంపరిసన్నాత్మవృత్తి
స్సైనాభూచ్ఛవ్యపగతమహాదైన్యతాపాతిరేకా॥

చ॥ పరశివకాంతయిట్టులని వార్యకృపాపగయై కాంతపై
వరవివియోగకారణముబల్కి శుభంబని చెప్పిపోవఁగా
సరగునమేలుకాంచిచెలిస్వప్నకథావిధిరూకుశీఘ్రమూ
దరమునఁజెప్పిదైన్యపరితాపమువాసిదొలంగెమేఘుఁడా॥ ౧౮॥

అర్థము—కామేశ్వరవరతనౌ=కామేశ్వరునిభార్యయగు, తస్యాం=ఆవర దేవత, స్ఫురితకరుణాసారం, స్ఫురిత=స్పష్టమైన, కరుణాసారం=దయాగసముగల

నుమట్లుగ, ఇతి=ఈప్రకారముగా, ఆదిశ్య=చెప్పి, అంతర్హితాయాం=అంతర్ధానముపొందినదగుచుండగా, అస్మదాళీ=మాచెలి, ఉత్థితైవ=లేచుచునే, తద్వృత్తాంతం=ఆస్వప్నవృత్తాంతమును, సంప్రసన్నాత్మవృత్తిః=నిర్మలమైనమనోవ్యాపారముగలదై, అరం=శీఘ్రముగా, సమగదత్=చెప్పెను, తేన=దానిచేత, వ్యపగత......తేకా, వ్యపగత=పోయిన, మహాదైన్య=గొప్పదీనత్వమువల్లనైన, తాపాతిరేకా=సంతాపాతిశయముగలది, అభూత్=ఆయెను,

తా—ఈప్రకారమాలలితామహాదేవి కరుణారసము వెల్లివిరియునట్లుగా, తొలిబాముననీవొనర్చినయపరాధముల వెలిబుచ్చి, మీదశుభంబొనగూడునని చెప్పియంతర్ధానమునొందె. పిదపనీయక్షకాంతయు దుఃఖమునువీడి దేవీవాక్యములవలననోదార్పుజెంది నిర్మలమనస్కయై యీవృత్తాంతమును మాకుంజెప్పె "అథం" ఉత్థితైవ వీనివలన యోగ్యమగు స్వప్నముగాంచినపుడు సత్వరముగా లేచుటయు, మరల నిద్రింపకుండుటయు నీమొదలగు స్వప్నశాస్త్రానుగుణ్య ప్రవర్తనలు సూచింపబడుచున్నవి.

శ్లో॥ అప్యేవంసామమసహచరీత్యక్తభోగానుషక్తిః
శ్రీదేవీముత్కరణకరణవ్యాపృతిర్వీతఖేదా
తత్సేవానుప్రియతమ్హృదయాసాయసాపీతదుగ్ధా
తత్కారుణ్యోదితశితమతిర్వర్తతేసాధువృత్తా॥

చ॥ లలితవచించినట్టి సుఖములన్నదిఁ గోరకయక్షకాంతలో
దలఁచివరాంబికామదిముదంబొదవంగ సేవలిమ్ముగా
సలుపుటవీతఖేదయయి సంధ్యలఁబాలను గ్రోలిశ్రీసతీ
లలితకటాక్షవీక్షణములన్నలఁగాసతిసచ్చరిత్రయై॥ ౧౯॥

అర్థము—మమ—నాకు, ప్రియసహచరీ=స్నేహితురాలగు నా యక్షకాంత, ఏవమపి=ఈప్రకారము లలితనుండి వరముపొందినదైనను, త్యక్తభోగానుషక్తిః=విడువఁబడినవిషయేచ్ఛగలదై, శ్రీదేవీ...వృతిః, శ్రీదేవీ=ఆలలితకు, ముత్కరణ=సంతోషముచేయునట్టి, కరణ=వ్యాపారములందు, వ్యాపృతిః=వ్యాప్తికలదై, వీత

సదా=విచారము నువదలి తత్పేవాసు=ఆలలితా పూజలయందు, ప్రయతప్రాదయా=నియతమైనమనస్సుగలదై, సాయం=సాయంకాలమందు, ఆప్రీతదుగ్ధా=క్షీరపానీయము చేయునదియై, తత్పా...మతిః, తత్పా-రుణ్యా=ఆదేవియొక్క-దయచేతను, ఉదితా=కలిగిన, సితమతిః=చురుకైనబుద్ధికలదై, సాధువృత్తా= సద్వ్యాపారముకలదై, వర్తతే=ఉన్నది.

తా—ఓ మేఘుడా! ఈప్రకారము నా చెలియగు యక్షపరదేవతచేనో దార్చఁబడినను, ఐహికసుఖేచ్ఛలనువీడి లలితాంబికనింకను మెప్పించుటకై పూజించుచు, తత్పూజాపరవశయగుటచే దుఃఖోపశమనంబునొంది, దివసావసానమువరకు భుజింపకయే నిర్మలమానసయై సద్వ్యాపారంబుల కాలంబుపుచ్చుచు, క్షీరోపహారిణియై యున్నది.

శ్లో॥ గానస్థానేపరశివవధూదివ్యనామావళీనాం
గాథాస్థానేభువనజననీ భవ్యలీలాకథానాం
క్రీడాస్థానేచిదనలజనేర్భండదైతేయయుద్ధ
ప్రాగల్భ్యానాంప్రతిదినమహో బోభవీతిప్రసక్తిః॥

చ॥ పరశివకాంతనామములె పాడును గానము సేయనెంచినన్
దరుచుగనాజగజ్జనని సవ్యకథావళులాలకించు సుం
దరముగనాటలాడలలితాకృతభండసురారిభండనం
బరయగజూపుకాలమిటు యాపనసేయును భక్తిమిత్రిమా॥ ౨౦॥

అర్థము-గానస్థానే, సంగీతకాలక్షేపమునకుబదులు, పరశివవధూ=లలితయొక్క- దివ్యనామవళీనాం=సహస్రనామములయొక్క-యు, గాథాస్థానే=పురాణకాలక్షేప సమయమున, భువన=......కథానాంభువనజననీ=ఆలోకమాతయొక్క-, భవ్య=మంగళప్రదమైన, లీలాకథానాం=విలాసవృత్తాంతముల యొక్క-యు, క్రీడాస్థానే ఆటలకుబదులు, చిదనలజనేః = లలితయొక్క-, భండదైతేయయుద్ధ=ప్రాగల్భ్యానాం, భండదైతేయ=భండాసురునితోనైన, యుద్ధప్రాగల్భ్యానాం=యుద్ధసామర్థ్యములయొక్క-యు. ప్రసక్తిః=ప్రసంగము, ప్రతిదినం=ఎప్పుడును, బోభవీతి=అత్యంతము జరుగుచున్నయది, అహో=ఆశ్చర్యము.

తా—పవిత్రధనమును సంగీతస్థానమున లలితాసహస్రనామావళీ పఠనమును, పురాణశ్రవణ సమయమందు జగజ్జననిలీలాకథలను వినుచును, ఆటలస్థానమునఆలలితయొక్క భండాసురవధసైన్యప్రత్యావలోకనముచేతను, నాయకుకాంతకాలయాపనము చేయుచున్నది. ఎల్లప్పుడును సమస్త కార్యకరణంబున నామె మనమునందు దేవతాయత్తమయియుండెననుట.

“చిదగ్నికుండసంభూతా” ఇత్యాదిలలితాభాష్యాదుల విశేషణములచేతను ఒకానొకకల్పమందు భండాసురునిచే దేవతలుబాధింపఁబడుచుండ నాబాధాపనోదనంబునకై ముమ్మూర్తులమ్మహాశక్తి నారాధింప, చిదగ్నినుండి యాపరాశక్తి లలితారూపంబున నవతరించితద్వధగావించెనని లలితాఖండమునప్రసిద్ధము “గానస్థానే” ఇత్యాదికముచే,

శ్లో॥ శారీయాసీత్సురతసమయవ్యాహృతోద్ఘాటనేన
వ్రీడాహాసస్ఫురణజనితామోదభారప్రదాత్రీ
తాంమార్జాలీమివనగణయత్యేవసాస్మద్వయస్యా
శార్యాహారే విగళితమనాః కార్శ్యమాలంబతేఽపి॥

చ॥ రతిసమయోక్తులన్ జిలుకరమ్యతరంబుగఁబల్కఁ జైటనం
చితముగనొప్పసిగ్గునొక చెంతనుహాసముమోదమందుసం
స్తుతమతియాశుకంబిడుడ, సాక్కుచుచుండినఁదింకిలేకమా
సతిగనివిల్లిరీతిగ నసహ్యముఁ జెందుచునుండెనక్కటా॥ ౨౧॥

అర్థము—యా=ఏ, శారీ=గోరింక, సురత... నేన, సురతసమయ=క్రీడా సమయమందలి, వ్యాహృత=మాటలయొక్క, ఉద్ఘాటనేన=ప్రకటించుటచేత, వ్రీడాహాస....... దాత్రీ, వ్రీడా=లజ్జయొక్కయు, హాస=నవ్వులాటయొక్కయు స్ఫురించుటచేతను, జనిత=పుట్టిన, ఆమోదభార=సంతోషాతిశయమును, ప్రదాత్రీ=చేయుచున్నదై, ఆసీత్=ఉండెనో, సా=ఆ, శారీ=గోరింక, ఆహారే=ఆహారమందు, విగళితమనాః=ఆసక్తిలేకయుండి, కార్శ్యం=కృశత్వమును, ఆలంబతేఽపి

పొందుచున్నప్పటికి, అస్మద్వయస్యాః=నాసఖురాలగు యక్షి, తాం=ఆకారికను, మార్గాలీమివ=మార్గాలమునువలెనే, నగణయత్యేవ=లెక్కచేయుటయే లేదు

తా—మఱియుపూర్వము కేళీమందిరమున క్రీడాసమయమందలి రహస్యవచనములను కాలాంతరమున వెల్లడించితనకుసిగ్గును నవ్వును మాటమాటికి గల్గించెడి పెంపుడు గోరువంకను గాంచి యనితానందమునొందు, నీ మెయిప్పుడు వియోగముచే చిత్తస్వాస్థ్యము లేక యాహారాదుల జోక్యము కలుగకేనుకొనకుండుటచే తిననొల్లక చిక్కుచున్న నాపక్షినిగాంచి లెక్కకేయకయే మార్జాలమునువలెతిరస్కరించుచున్నది. అనగ "దుఃఖితేమనసిసర్వమసహ్య" మ్మనునట్లు చిత్తస్వాస్థ్యము లేనియామెకుదేవ్యపాసనగాక మఱిమియు రుచించుటలేదని తాత్పర్యము "మార్జాలీమివ" యనునది "శ్వానకుక్కుటమార్జలః పోషయంతి దినత్రయం ఇహాజన్మనిశూద్రత్వంఛండాలః కోటిజన్మసు" అనునట్లుమార్జాల పోషణముశాస్త్ర నిషిద్ధంబగుట ప్రసిద్ధము "శారీఆహారేవిగళితమనాః" ఈయక్షవియోగతాపమును జూచి పక్షులుకూడ యాహారాదులను పేక్షించుటచే నట్లుగన్పట్టుటచే నివియు తమసానుభూతిని గనపఱచుచున్నట్లు స్ఫురించుచున్నది.

శ్లో॥ పున్నాగస్యచ్ఛదవిటపిసంక్లృప్తనీలాభ్రబుద్ధే
ర్మూలేమార్గాసితమరకతగ్రావసంధీక్షితే
బర్హ్యాసీనోరిపుమవిశరశ్శార్ఙ్గలమాకాంతతే౽హో
ధీమాఞ్భావిప్రమదహృదయశ్శాత్రవంమాంతతేయః॥

చ॥ దళములు చాలఁగల్గజలదంబనువిభ్రమఁ జేయుపొన్నక్రిం
దలలితఘాసనీలరుచిశాగ్ర్యశిలాసనమందునిల్చివి
శ్చలతఁదలంచె నెమ్మితనశత్రువమైనశరత్సమాగమం
బలఘుమనీషికష్టమిపుడైననుభావిశుభంబుగోరఁడే॥ ౨౨॥

అర్థము—ఛదవిటపిసంక్లృప్త నీలాభ్రబుద్ధేః, ఛద=ఆకులయొక్క, విటపి=విశాల్యముచేత, సంక్లృప్త=చేయబడిన, నీలాభ్రబుద్ధేః=నల్లని మేఘమనుబుద్ధిగల, పున్నాగస్య=పొన్నచెట్టుయొక్క, మూలె=మూలమందు, మార్గా......పీఠే,

దూర్వా=పచ్చిగడ్డివలె, అసిత=నల్లనైన, మరకతగ్రావ=గరుడపచ్చలచేత, సం
దీప్ర=ప్రకాశించుచున్న, పీఠే=ఆసనమందు, ఆసీనః=కూర్చున్న, బర్హీ=నెమలి
(ఇప్పుడు) రిపుమపి=శత్రువైనను. శరత్కాలం=శరదృతువును, ఆకాంక్షతే=
కోరుచున్నది, యః=ఎవడు, భావి=రాబోవు, ప్రమదహృదయః=సంతోషమును
మనస్సునందు కలవాడై, శాత్రవం=శత్రుసంబంధమైనదానినైన, మాంక్షతే=కోరు
చున్నాడో, సః=వాడే, ధీమాన్=బుద్ధిమంతుడు

తా—ఆకులయొక్క వైశాల్యముచేత మేఘమను భ్రాంతిని కలుగజేయు పున్నా
గవృక్షముయొక్క మూలమందు, దూర్వాంకురములవలె పచ్చనైనపచ్చరాపీటపై
నుండిన నెమలియును, ఇప్పుడు తనకు శత్రువయినను, యత్నునిశాపావధియగు శర
త్కాలాగమమునే కోరుచున్నదివలె నెయున్నది. భావిశుభంబులగోరి యిప్పటి
కష్టగండ్లకు బాల్పడ సమకట్టువాడే బుద్ధిమంతుడు.

"రిపుమపి" స్వామిహితమును గోరు సేవకులు తమకష్టములను గణింపక యజ
మానునికి సుఖంబొనగూర్చుటయె యవశ్యకర్తవ్యంబుగ పరిగణింతురు.

శ్లో॥ కిరేబింబభ్రమపరవశేస్వాధరాస్వాదనోత్కే
గచ్ఛత్యారాత్స్వవలయమణిశ్రేణికాదర్శనేన
కారుణ్యాద్యాకరకఫలభూబీజబుద్ధింవ్యతానీ
త్సాహోఽపశ్యత్యవిధురితాదుఃఖనఃకిన్నుసేవ్యం

చ॥ తనయధరంబుబింబమనిదాపునఁ జేరినజిల్కనొక్క రా
దనవలయాగ్రరత్నములదాడిమబీజపుటానవిల్పిదా
నసువ్రనాడుచానవిరహంబునఁజూడదుదానినిప్పుడా
గ్గనకుముదంబుగానొకఁడు తోచుటఁ గాంచిలిమేధరాస్థలిఁ॥ ౨౩॥

అర్థము—బింబభ్రమపరవశే, బింబభ్రమ=దొండపండను భ్రాంతికి, పరవ
శే=లోబడినదై, స్వాధరాస్వాదనోత్కే=స్వాధర=తనయధరముయొక్క, ఆస్వా
దన=ఆస్వాదించుటయందు, ఉత్కే=ఆసక్తి కలదై, ఆరాత్=సమీపమునకు, కిరే=

చిలుక, గచ్ఛతి=వచ్చినదగుచుండగా, యా = ఏనాసఖి, కారుణ్యాత్=దయవలన స్వవల......సేన, స్వవలయ = తనకంకణమందలి, మణిశ్రేణికా = రత్నములవరు సయొక్క,దర్శనేన = చూపుటచేత, కరకఫలభూబీజ = దానిమ్మగింజలయొక్క బుద్ధిం = మతిని, వ్యతానీత్ = చేసినో, సా = అట్టిచెలి, విధురితా = విరహవతి యై, నోపశ్యత్యపి = దానిచూచుటయైన లేదు. దుఃఖినః = దుఃఖము జెందినవానికి, సేవ్యం = సేవింపతగినది, కిం = ఏమున్నది.

తా—నాచెలియొకప్పుడు విలాసముగ చిలుకనుజేరదీయునప్పుడది నొండపం డను భ్రమచేసి మెమోవిని గఱవయత్నింప, దనముంజేతికంకణమందలి మాణిక్యము ల వరుసనుజూపిదానికాహారంబగు దాడిమబీజముల భ్రమగలిగించి తనయధరస్ప ర్శనమునుండి తొలగించుచు విలాసముగ గ్కాలముపుచ్చుచుండెడిది. ఇప్పుడట్టిసంతోష మునువీడి వానినిచెంతనైన జేరనిచ్చుటలేదు. దుఃఖవంతునకెవ్వియుమదంబొసగ స మర్థములు గావు.

శ్లో॥ ప్రోద్యత్త్రోష్టీనిచయలలితైః కర్కశైః పద్మకోశైః
శోణాంభోజచ్ఛదసురుచిభిర్మందమందైశ్చభంగైః
యానశ్రీభిర్విశదగతు తాంతీరభూరాట్ప్రికానాం
నాధైర్వ్యాకీస్వమనుసరతీతీర్ష్యయేవేక్షితేనో॥

చ॥ చంచలమీనసంపదను, సారసకర్కశకుట్మలైఖరిఁ
మించినయొఱ్ఱకల్వపస మెల్లఁగవచ్చు తరంగశోభరా
యంచలయానపుంగరిమ నాదరిచెల్ల పికస్వసంబు దా
నెంచుచునాకునిద్దిసరియేయని వావిఁగఁజూడదీర్ష్యచే॥ ౨౮॥

అర్థము—ప్రోద్య......లితైః, ప్రోద్యత్=ఎగురుచున్న,ప్రోష్ఠీ=చేపలయొ క్క, నిచయ=సమూహముయొక్క, లలితైః= విలాసములచేతను, అనగ=తత్సదృ శనేత్రవిలాసములచేతననిభావము, కర్కశైః=మిగుల బిగువుగల, పద్మకోశైః = తామరమొగ్గలచేతనూ, తత్సదృశస్తనములచేతననుట, శోణాంభోజచ్ఛదసురుచిభిః శోణాంభోజ=ఎఱ్ఱకలువలయొక్క, చ్ఛద=దళములయొక్క, సురుచిభిః=కాంతు

లచేతను, తత్సదృశరదచ్ఛదములచేతననుట, మందమందైః=అత్యంతము మందము లైన, భంగైః= తరంగములచేతను, తత్సదృశవళీ భంగములచేతననుట, విశదగరుతాం = హంసలయొక్క, యానశ్రీభిః = గమనసంపత్తిచేతను, తీరభూరుట్పికానాం= ఒడ్డునయుండెడి చెట్లయందలి కోకిలలయొక్క, నాదైః = ధ్వనుల చేతను, తత్సదృశమగు స్వనముచేతను) మాటలచేతను, వాపీ = సరస్సు, స్వం = తనను, అనుచరతీతి = అనుసరించుచన్నదని, ఈర్ష్యయైవ = అసూయచేతను వలెనే, నో ఈక్షతే = చూడదు.

తా —వియోగదుఃఖార్తయగు నాయేలిక, జలక్రీడాదులఁబరిత్యజించుటేగాక, క్రీడార్థంబగుచుండు భావితనయవయవవిలాసంబున కనురూపంబులగు మత్స్యాది వస్తుసముదాయము గ్రహించి శృంగారాకృతివహించిన యొకస్త్రీవలెనే, ఇప్పుడు కృశించియున్న తనసధి క్షేపించుచున్నదని తలఁచియీర్ష్య చెందిన దానివలెనే దానిగనుగొన నైనతలపెట్టదు. లోకమునకష్టదశలో నుండువారు పూర్వమునతారను భవించినట్టి సౌఖ్యమునను భవించుచు విలాసముగ నుండెడివారి గాంచిన, తమపూర్వస్థితిస్మరణకు వచ్చుటచే దుఃఖంబమితంబగునని యెంచి నట్టివారివిషయమైయీర్ష్యచెందిన వారివలెనె వారి జూడనొల్లరనుటలోకానుభవప్రసిద్ధము.

శ్లో॥ స్వాజ్ఞాకర్త్ర్యపిపరిజనే నాస్వయం ప్రేమభావా
దాగారాంతస్థగితలలితా లేఖ్యలావణ్యహేతోః
వక్షోజాతాంబరవిలసనం యావిధత్తే స్మసేయం
నైవాపశ్యత్తదితశుచాతానిమాలిస్యభాంజి॥

చ॥ పరిజనమాజ్ఞలేచి నిలువంబడియుండినసైన నింట చి
త్తరువులు స్వచ్ఛమైనను ముదంబునఁబయ్యెదతోడ దానెవే
మరుదళుకొత్తఁగాఁ దుడుచు మానినియిప్పుడు మాసియున్న చి
త్తరువులఁజూడదీవిరహ తాపమునన్నది గుంది మేఘమా॥ ౨౪॥

అర్థము—పరిజనే= పరిజనము, స్వాజ్ఞాకర్త్ర్యపిహి = తనయాజ్ఞనుచేయు చుండగానే, యా = ఏనాచెలి, ప్రేమభావాత్= ఆసక్తివలన. ఆగారాంతస్థగిత=

ఇంటిలోపల నుంచబడిన, లలిత=చక్కని, ఆలేఖ్య=పటములయొక్క, లావణ్యాహితోః=సౌందర్యము నిమిత్తము, వక్షోజాతాంబర=పైటకొంగుయొక్క, విలసనం=ప్రసారము, తుడుచుటకై యనుట, విన్యస్తైః=చేసెనో, సేయం=ఆయీయక్షకాంత, తదుదితశుచా=ఆవిరహామువలన బుట్టినదుఃఖముచేత, మాలిన్యభాంజి=మాలిన్యము పొందిన, తాని=ఆపటములను, నైవాపశ్యత్=చూడనేలేదు.

తా—పూర్వమందు సేవకులున్నను స్వయముగనే తన క్రీడాగృహామందలి చిత్రలేఖ్యముల ప్రేమచే, తన పైటకొంగుచేతనే శుభ్రము చేయుచుండెడిది. అట్టి యామె ఈ విరహదుఃఖముచేత వానివంక జూచుటయైన లేదని యాయక్షి చెలికత్తె మేఘునితో చెప్పెను.

శ్లో॥ ఇత్యాఖ్యాత్యామృతచరితం సాధుసఖ్యాం ప్రవృత్తం
ధ్యానాధీనా మలినమనసా ముక్తకల్పాథ యక్షీ
ఆసీనా సా చరణనికటే సన్నిషణ్ణం పయోదం
ప్రేమ్ణాలోక్య ప్రకృతముచితం వ్యాహృతం వ్యాజహార॥

చ॥ చెలియిటు బల్కఁగా సుధలు జిమ్ముచు తచ్చరితంబు యక్షిలో
దలఁచి పరాంబికాచరణ తామరసంబుల ఏకముఖ్యయై
జలదుని గాంచి పాదముల సన్నిధినుండఁగఁ బ్రేమనిట్లుగా
బలికె హితోక్తి ప్రస్తుతము బల్కఁగ యోగ్యముగాఁగ మోదయై॥

అర్థము—ఇతి=ఈప్రకారము, సఖ్యా=చెలికత్తె, అమృతచరితం=అమృతస్వరూపమగు, పరివృత్తం=తమవృత్తాంతమును, సాధు=బాగుగా, ఆఖ్యాత్యాం=చెప్పినదగుచుండగా, అథ=అటుతర్వాతను, సా యక్షీ=ఆయక్షాంగన, ధ్యానాధీనా=దేవతాధ్యానమునకధీనురాలై, మలినమనసా=దుఃఖితమగుమనస్సుచేత, ముక్తకల్పా=విడువబడినదివలెనే, ఆసీనా=కూరుచున్నదై, చరణనికటే=పాదసమీపమందు, సన్నిషణ్ణం=నివసించిన, పయోదం=మేఘుని, ప్రేమ్ణా=ప్రేమచేతను, ఆలోక్య=చూచి, ప్రకృతం=ప్రస్తుతమై, ఉచితం=తగిన, వ్యాహృతం=మాటను, వ్యాజహార=చెప్పెను.

తా—తనచెలికత్తె యీప్రకారము తనవృత్తాంతమును చెప్పినతర్వాత దేవతాధ్యానముచే స్థిమితపడిన మనస్సుకలదై యీయక్షిలేచి కూర్చుని, తనసమీపమునను న్న మేఘుని జూచి చెప్పదొడంగెను.

''అమృతచరితం'' అనుటవలన తనహితుండగు యక్షుండు తనప్రియురాలి పాతివ్రత్యమునుగూర్చి చెప్పినవాక్యము లీమె ప్రవృత్తితో సరిపోవుచుండుటవలన, మేఘుని కీచెలికత్తెమాట లమృతప్రాయములై మనంబలరించెనని తాత్పర్యము. ''ముక్తకల్ప'' యన్నోదంతము దూతవలన విన్నదగుటచే దుఃఖము కొంతయుపశమించినను, భర్తృసమాగమము ప్రాప్తింపనందున పరిపూర్ణముగా విడువలేదనుట.

శ్లో॥ అభ్యాశేతేనకిమపి మయావత్ససంగోపనీయం
యత్త్వంతేనాత్మతనుజధియా ప్రేయసాస్వీకృతోసి
తస్మాదద్యోచితమపినవాక్యతెమత్ప్రియస్య
శ్రోత్రాతిథ్యంకురుచపరతోవిస్మరేదంవచోమే॥

చ॥ వారిదనీసమీపమున( బల్కఁగదాచువచస్సునాకులే,
దారయునిన్ను నాదయితుఁ డాత్మజురీతిగఁ బ్రేమనెంచుటే,
గారణమేయవాచమ్మది కాదనియెంచక చెప్పుసర్వమా,
ధీరునిశ్రోత్రపేయముగ దెల్పియవెంటని విస్మరింపుమా॥ ౨౭॥

అర్థము ఓవత్స=ఓమేఘుడా, తె=నీయొక్క, అభ్యాశే=సమీపమునందు, మయా=నాచేత, సంగోపనీయం=దాచతగినది, కిమపిన= కొంచెమునులేదు యత్=ఏలనన= త్వం=నీవు, తేనప్రేయసా=ఆనాప్రియునిచేత, ఆత్మతనుజధియా=పుత్రబుద్ధిచేతను, స్వీకృతోసి=గ్రహింపఁబడితివి, తస్మాత్=అందువలన, ఉచితమపినవా=తగనిదైనను, కధ్యతే=చెప్పబడుచున్నది, మత్ప్రియస్య=నాప్రియునకు, ఇదంమేవచః=ఈనావాక్కును, శ్రోత్రాతిధ్యంకురు=చెప్పుము. పరతః=వెంటనే, విస్మర=మఱువుము.

తా—ఓమేఘుడా! నాభర్తచేతను నీవుపుత్రబుద్ధిచే స్వీకరింపబడితివి గావున నీకు దాచతగినదెద్దియులేదు. కావున రహస్యమగుటవలనచెప్పకూడని విషయ

ము లెవ్వియు నుండవు గాన, చెప్పుచుంటిని ఈవృత్తాంతమును నాప్రియుని మనంబలరించునట్లు చెప్పి వెంటనే మఱచిపొమ్ము. ఇంకొకచో ప్రకటింపతగినది కాదని తాత్పర్యము.

శ్లో॥ హాస్యేనాపిప్రియఇతిమహాన్ వంచనీయోనలోకై
స్తచ్చేత్తేషాంభవతివిపదాసత్యమేతంబ్రవీమి
అస్మత్క్లృప్తోయమితితిమిరధ్వంసనేచేదగారే
స్పృష్టోదీపోనదహతికరంతత్క్షణేనైవకర్తుః

చ॥ మోసము చేయగూడదొక పూజ్యుని లోకము మోసగించినన్
వాసిదొలంగు పూజ్యునకవశ్యము బాధలు కల్గు నిక్కమూ
వాసమునందు జీకటిని బాపగ బెట్టినదివ్వె ముట్టినన్
గాసియొసంగ కర్తకును గావున వల్లడి సేయకీనుడిన్ ॥ ౮౨॥

అర్థము — మహాన్ = పూజ్యుడు, ప్రియఇతి = ఇష్టుడుగదాయని, హాస్యేనాపి = పరిహాసము చేతనైనను, లోకైః = జనులచేతను, వంచనీయః = వంచింపతగినవాడు, న = కాడు, తచ్చేత్ = అట్లువంచించుటగలిగినట్టయిన, తేషాం = వారికి, విపదా = ఆపత్తు, భవతి = అగుచున్నది, ఏనం = ఈప్రకారం, సత్యం = నిజముగా, బ్రవీమి = చెప్పుచున్నాను, అయం = ఈదీపము, అగారే = గృహమందు, తిమిరధ్వంసనే = చీకటి పోగొట్టుటకై, అస్మత్ క్లృప్తం = మనచేతకల్పింపబడినది. ఇతి = ఈలాగునని, స్పృష్టశ్చేత్ = స్పృశింపబడినచో, తత్క్షణేనైవ = వెంటనే, కర్తుః = స్పృశించినవానియొక్క, కరం = చేతిని, నదహతికిం = కాల్పదా ఏమి.

తా — లోకమున పూజ్యుడైనవాడు ఇష్టుడుగదాయని పరిహాసమునకైన వంచింపతగినవాడుకాడు అట్లువంచించినయెడల వారికి అనగా అట్లువంచింపబడినవారికి కీడుమూడుననుమాట సత్యము చీకటిని పోగొట్టుటకొక దివ్వె మనచేనిర్మింపబడినదేగదాయని స్పృశించినచో చేతిని కాల్పకుండునా? అట్లనే దీపమును స్పృశించి [illegible]ం చింపబడి దుఃఖించినటుల నీయందలి విశ్వాసముచే దెల్పిన మానర్మాలాపముల వెలిబుచ్చినచో నేము దుఃఖాస్పదులమగుదుము. కావున నట్లుచేయదగదని భావము

